



శ్రీరస్తు.

# నృసింహశతకము.



శ్రీమనోహరసురార్చితసింధుగంభీరభక్తవత్సలకోటిభానుతేజ| కంజనేత్రహిరణ్యకశ్యపాంతకశూరసాధురక్షణశంఖచక్రహస్త | ప్రహ్లాదవరదపాపధ్వంసనసర్వేశక్షీరసాగరశయనకృష్ణవర్ణ | పక్షివాహననీలభ్రమరకుంతలజాలపల్లవారుణపాదపద్మయుగళ| చారుశ్రీచందనాగురుచర్చితాంగ| కుంకుమాంకితవైకుంఠధామ| భూషణవికాసశ్రీధర్మపురనివాస | దుష్టసంహారనరసింహదురితదూర|| ౧|| పద్మలోచనసీసపద్యములునీమీదచెప్పబూనితినయ్యదిత్తగింపు| గణయతిప్రాసలక్షణముజూడగలేదు పంచకావ్యశ్లోకపఠనలేదు| అమరకాండత్రయంబరసజూడగలేదుశాస్త్రీయగ్రంథముల్చదువలేదు| నీకటాక్షంబుననేరచింతినిగానిప్రజ్ఞనాయదిగాదుప్రస్తుతింప| దప్పుగలిగినసద్భక్తితక్కువౌనె| చెరకునకువంకబోతేమిచెడునతీపు| భూషణ||౨|| నరసింహనీదివ్యనామమంత్రముచేతదురితజాలములన్నిదోలవచ్చు | నరసింహనీదివ్యనామమంత్రముచేతబలువైనరోగముల్బాపవచ్చు| నరసింహనీదివ్యనామమంత్రముచేతరిపుసంఘములసంహరించవచ్చు | నరసింహనీదివ్యనామమంత్రముచేతదండహస్తునిబంట్లదరుమవచ్చు| భళిరనేనీమహామంత్రబలముచేత| దివ్యవైకుంఠపదవిసాధించవచ్చు | భూ -౩- ఆదినారాయణయనుచునాలుకతోడబలుకనేర్చినవారిపాదములకు| సాష్టాంగముగనమస్కారమర్పణజేసెబ్రస్తుతించెదనయ్యబహువిధముల| ధరణిలోనను ఎంతదండివారైనను నిన్నుగాననివారినేస్మరించ | నేనుశ్రేష్ఠులకుంచునిక్కముండెడివారిచెంతజేరగబోనుశేషశయన| పరమసాత్త్వికులైననీభక్తవరుల | దాసులకుదాసుడనుసుమ్మిధాత్రిలోన| భూ -౪- ఐశ్వర్యములకునిన్ననుసరింపగలేదుద్రవ్యమిమ్మనివెంటదగులలేదు| కనకమిమ్మనిచాలకష్టపెట్టగలేదుపల్లకిమ్మనినోటబలుకలేదు | సొమ్ములిమ్మనినిన్నునమ్మికొల్వగలేదుభూములిమ్మనిపేరుబొగడలేదు | బలములిమ్మనినిన్నుబతిమాలగాలేదుపసులనిమ్మనిపట్టుపట్టలేదు | నేనుకోరినదొక్కటేనీలవర్ణ చయ్యననుమోక్షమిచ్చినజాలునాకు| భూ-౫|| మంచివానిన్నేననిందజేసిననేమినాదీనతనుజూచినవ్వతేమి| దూరభారములేకదూరనాడితేనేమిప్రీతిసేయకవంకబెట్టితేమి| కక్కసంబులుదిట్టివెక్కిరించిననేమితీవ్రకోపముచాటితేనేమి| పెడసరమాటలుగొన్నిపిమ్మటాడి

న నేలు చెఱిదాపట గేలి జేసితేను సల్పవృత్తుం వరెనీవు ఛిద్రంబు బ్రజల లక్ష్యం
బు నా కేల పద్మనాభ! భూ ॥౬॥ చిత్తశుద్ధిగ నీకు సేవ జేసెద గాని పుడమిలో దం
భ మోహంబులకు గాదు | జన్మపావనతకై స్మరణ జేసెద గాని సాటివారలయం బ్రతిష్ఠల
కు గాదు | ముక్తికోసరము నే మ్రొక్కి వేడెద గాని దండిభాగ్యము నిమిత్తంబు గా
దు | నిన్ను బొగడగ విద్య నేర్చితి నే గాని కుక్షిని జెడి కూటికొరకు గాదు | పార
మార్థికమునకు నే పాటుబడితి | కీర్తికిని పేరుపడ లేదు కృష్ణవర్ణ | భూ ॥౭॥
శ్రవణరంధ్రములు నీ సత్కథల్ పొగడంగ లేశమానందంబు లేనివాడు | పుణ్యవం
తులు నిన్ను పూజ సేయగ జూచి భావమందుత్సాహపడనివాడు | భక్తవర్యులు
నీ ప్రభావముల్ పొగడంగ దత్పరత్వము లేక దలగువాడు | తన చిత్తమందు నీ ధ్యా
నమెన్నడు లేక కాలమంతయు వృధా గడుపువాడు | వసుధలో నెల్ల వర్యుండు
నా జెలగును | మరియు జెడుగాక యెప్పుడు మహిని వాడు - ౮ - గౌతమీస్నా
నాన గడతేరుదామంటె మొనసి చన్నీళ్లలో మునుగలేను | తీర్థయాత్రల చేగృ
తార్థుడవుదామంటె బడలి నేమంబు లేనడపలేను | దానధర్మముల సద్గతిని జెందె
దమంటె ఘనముగా నావద్ద ధనము లేదు | తపమాచరించి సార్థకము నొందెద
మంటె నిమిషమైన మనస్సు నిలుపలేను | కష్టములకోర్వ నా చేత గాదు నిన్ను | స్మ
రణ జేసెద నా యథాశక్తి కొలది ॥ ౯ ॥ అర్థివాండ్లకు నీకహాని జేసుటకంటె
దెంపుతో వసనాభి దినుట మేలు | ఆడబిడ్డల సొమ్ములపహరించుటకంటె బండగ
ట్టుక సూత బడుట మేలు | పరుల కాంతల బట్టి బల్మి జేరుటకంటె గుక్షిక త్తితో గు
మ్మికొనుట మేలు | బ్రతుక జాలక దొంగపనులు జేసుటకంటె గొంగుతో ముష్టి
యెత్తుకొనుట మేలు | జలజదళనేత్ర నీ భక్తజనులతోటి | జగడమాడెడు పనికంటె
చావు మేలు - ౧౦ - గార్దభంబున కేల కస్తూరి తిలకంబు మర్కటంబున కేల మ
లయజంబు | శార్దూలమున కేల శర్కరాపూపంబు సూకరంబున కేల చూత
ఫలము | మార్జాలమున కేల మల్లెపువ్వుల బంతి గుబ్బగూబకు నేల కుండలములు |
మహిషంబు కేల నిర్మలమైన వస్త్రముల్ బకపక్షికి నేల పంజరంబు | ద్రోహచిం
తన జేసెటి దుర్జనులకు | మధురమైనట్టి నీ నామమంత్ర మేల -౧౧- పసరంబు
పంజైన పసుల గాపరి తప్పు ప్రజలు దుర్జనులైన ప్రభుని తప్పు | భార్య గయ్యాళైన
ప్రాణనాథుని తప్పు తనయుడు దుష్టయిన తండ్రి తప్పు | సైన్యంబు చెదరిన సైన్యనా
థుని తప్పు కూతురు చెడుగైన మాత తప్పు | అశ్వంబు దుష్టైన నారోహకుని తప్పు
దంతి దుష్టయిన మావటీడి తప్పు | లిట్టి తప్పులెరుంగక నిచ్చవచ్చి | నట్టుల మెలగు
దురిప్పుడీ యవనిజనులు | భూ ॥౧౨॥ కోతికి జలతారు కుళ్లాయి యేటికి విరజాజి
పూదండ విధవ కేల | ముక్కిటి కొస్తురి కమ్మపువ్వుల తైల మద్దమేటికి నిజాంధు

నకును। మాచకమ్మకు నేల మౌక్తికహారముల్ క్రూరచిత్తునికి సద్గోష్ఠులేల। రంకుబోతుకు నేల రమ్యాంబునిష్ఠయు వాసియేటికి దుష్టవర్తనునకు। మాటనిలకడ సంకరమోటు కేల। చెప్పటివానికి సత్కథాశ్రవణమేల। భూ.-౧౩- మాన్యంబులీయ సమర్థుఁడొక్కఁడు లేఁడు మాన్యములిచ్చెరుపను సమర్థులంత। మొండినయ్యాళ్లఁగోడెరిగింపఁ దెవ్వఁడు పండినయ్యాళ్లకు ప్రభువులంత। యితఁడు పేదయటంచు నెరిగింపఁడెవ్వఁడు కలవారు శిశులెన్నఁగలరుచాల। తనయాలి చీరటితప్పెన్నఁడెవ్వఁడు పరకాంతరములెన్న పేదలంత। రిట్టిదోషులకధికారమిచ్చినట్టి। ప్రభువు తప్పంటటంచును బలుకువారు। భూ-౧౪- తల్లిగర్భమునుండి ధనము తేఁడెవ్వఁడు వెళ్లిపొయ్యేనాడు వెంటరాదు। లక్షాధికారైన లవణమన్నమె కాని మెరుగుబంగారంబు మ్రింగబోఁడు। విత్తమార్జనచేసి విర్రవీగుటె గాని కూడబెట్టిన సొమ్ము కుడువబోఁడు। పొందుగా మరుగైన భూమిలోపలబెట్టి దానధర్మము లేక దాఁచి దాఁచి। తుదను దొంగలకిత్తురో దొరలకవును। తేనెజుంటీఁగ లియ్యవా తెరువరులకు -భూ-౧౫- లోకమందెవఁడైన లోభిమానవుఁడుండె భిక్షమర్థికి చేత బెట్టలేఁడు। తాను బెట్టకపోతె తగువుపుట్టదు గాని యొరులు బెట్టగజూచి యోర్వలేఁడు। దాతదగ్గర జేరి దనములెపోయినట్లు జిహ్వతో పాడీలు జెప్పచుండు। ఫలము విఘ్నంబయిన బహుగ సంతోషించు మేలుగలిగిన చాలమిణుకుచుండు। శ్రీరమానాథ యిటువంటి క్రూరజనుని। భిక్షుకులశత్రుఁడని పేరుబెట్టవచ్చు -భూ-౧౬- తనువులో ప్రాణముల్ తరలిపొయ్యేటి వేళ నీ స్వరూపము ధ్యానించునతఁడు। నిమిషమాత్రములోన నిన్ను జేరును గాని యముని చేతుల జిక్కి శ్రమలపడఁడు। పరమసంతోషాన భజనజేసేటి వారి పుణ్యమేమనవచ్చు భోగిశయన। మోక్షము నీ దాసముఖ్యునకగు గాని నరకమెక్కడిదయ్యా నళిననేత్ర। కమలనాభుని మహిమలు గానలేని। తుచ్ఛులకు ముక్తిదొరుకుట దుర్లభంబు। భూ-౧౭-నీలమేఘశ్యామ నీవె తండ్రివి మాకు కమలవాసిని మమ్ము గన్నతల్లి। నీభక్తవరులంత నిజమైన బాంధవుల్ నీకటాక్షము మాకు నేకధనము। నీకీర్తనలు మాకు లోకప్రపంచంబు నీసహాయము మాకు సమయము। నీమంత్రమే మాకు నిష్కళంకపు విద్య నీపదధ్యానంబు నిత్యజపము। తోయజాక్ష నీ సొంత తులసిదళము। రోగములకౌషధము బ్రహ్మరుద్రవినుత। భూ ॥౧౮॥ బ్రతికిన న్నాళ్లు నీభజన తప్పను గాని మరణకాలమునందు మరతునేమొ। నా వేళ యమదూతలాగ్రహంబున వచ్చి ప్రాణముల్ పెకలించి పట్టునపుడు। కఫవాతపైత్యముల్ కప్పగా బరచేత కంపముద్భవమంది కష్టపడుచు। నా జిహ్వతో నిన్ను నారాయణాయంచు బిలుతునో శ్రమచేత బిలువలేనొ। నాటికిప్పుడె సేసెద నామభజను గో। తలచెదను

చెవులవినవయ్య ధైర్యముగను - భూ - ౧౯: పాంచభౌతికము దుర్బలమైన
కాయంబిదెప్పుడో పడిచేది యెరుకలేదు| శతవర్షములదాక మితము జెప్పిరి
గాని నమ్మరాదా మాట నెమ్మనమున| బాల్యమందో మంచి ప్రాయమందో లేక
ముదిమియందో లేక ముసలియందో | యూరనో యడవినో యుదకమధ్యంబు
నో యెప్పుడో విడిచేది యెరుకలేదు| మరణమే నిశ్చయము బుద్ధిమంతులైతె| దే
హమున్నంతలో మిమ్ము దెలియవలయు -౨౦- తల్లిదండ్రులు భార్య తనయులా
ప్తులు బావమరదులన్నలు మేనమామగారు | ధనము కాబాంధవుల్లరిగినప్పటి
కైన తాను తర్లగ వెంట తగిలిరాదు| యముని దూతలు ప్రాణమపహరించుక పో
గమను తత్తో పోరాడి మాన్పలేరు | బలగమందరు దుఃఖపడుట మాత్రమె కాని
యించుక యాయుష్యమియ్యలేరు చుట్టములమీది భ్రమదీసి చూరజెక్కి | సంత
తము మిమ్ము నమ్ముట సార్థకంబు -౨౧- ఇభరాజవరద నిన్నెంత బిలిచిన గా
నిమాటు బలుకవదేమి మౌనితనము| మునిజనార్చిత నిన్ను మ్రొక్కి వేడిన గా
కారమియ్యవదేమి ప్రౌఢతనము| స్థిరముగా నీపాదసేవ జేసెదనంటె దొరకజా
లవదేమి ధూర్తతనము| మోక్షదాయక నావంటి మూర్ఖజనుని| కష్టపెట్టితె నీ
కేమి కడుపునిండు -౨౨- నీమీద కీర్తనల్ నిత్యగానము జేసి రమ్యముండించ నా
రదుడ గాను| సావధానముగ నీచరణపంకజసేవ జేసి మెప్పించ టెక్కి శ్రీని గాను
బాల్యమప్పటినుండి భక్తి నీయందుల గలుగు సుప్రహ్లాదఘనుడ గాను|ఘనముగా
నీమీద గ్రంథముల్గల్పించి వినుతిసేయను వ్యాసమునిని గాను | సాధుడను ము
ఖ్యుడను మనుష్యాధముడను|హీనుడను సుమ్మి నీపున్నెలు కొమ్మ-భూ-౨౩
అతిశయ బుగగల్లలాడ నేర్చితిగాని పాటిగా సత్యముల్ పలుకనేర | సత్కా
ర్యవిఘ్నముల్సలుప నేర్చితిగాని యిష్టమొందగ నిర్వహింపనేర|నొకరి సొమ్ము
కు దోసిలొగ్గ నేర్చితిగాని చెలువుగా ధర్మంబు సేయనేర | ధనము నియ్యంగ వ
ద్దనగ నేర్చితిగాని శీఘ్రమిచ్చెటట్లు జెప్పనేర| పంకజాక్షు నేనైతె పాతకు
డను | తప్పులన్నియు క్షమియింపు తండ్రి నీవె -భూ- ౨౪- ఉర్విలో నాయుష్య
మున్నపర్యంతంబు మాయ సంసారంబు మరిగి నరుడు | సకలపాపములైన సం
గ్రహించెనుగాని నిన్ను జేసెడి భక్తి నేర్పలేదు| తుదకు కాలుని వద్దనుండు కింక
రులు వచ్చి గుంజుక పోయి వారు కొట్టుచుండ | హింసకోర్వగలేక యేడ్చి రంభలు
జేసి దిక్కులేదన నాల్గుదశల జూచు| దన్ను విడిపింపవచ్చెడి ధన్యుడేడి| ముందు
నీదాసుడయ్యెంచెడు భక్తిగలుగు |భూ||౨౫|| అధికవిద్యావంతులప్రయోజకు
లైరి పూర్ణశుంఠలు సభాపూజ్యులైరి | సత్యవంతుల మాట జనవిరోధంబా
యె వదరుబోతుల మాట వాసికెక్కె | ధర్మవాసనపరుల్ దారిద్ర్యులయ్యిరి ప

తములోభులు ధనస్థాపులైరి పుణ్యవంతులు రోగభూతపీడితులైరి నిష్ఠమానవులు దరిద్రులైరి పక్షివాహన మావంటి భిక్షుకులకు శక్తిలేదాయె నీవెదికి కావ భూషణ||౨౭|| భుజబలంబున పెద్దపులుల జంపగవచ్చు పాముకంఠము జేకట్టవచ్చు బ్రహ్మరాక్షసకోట్ల బాఱదోలగవచ్చు మనుజరోగములన్ని మాన్పవచ్చు జిహ్వకిష్టముగాని చేదుమ్రింగగవచ్చు పదనుఖడ్గముచేత నదుమవచ్చు కష్టమొందుచు ముండ్లకంపలో జొరవచ్చు తిట్టుబోతుల నోళ్లుగట్టవచ్చు పుడమిలో దుష్టులకు జ్ఞానబోధ దెలిపి సజ్జనుల జేయలేడెంత చతురుడైన||౨౮|| అవనిలోగలయాత్రలన్ని జేయగవచ్చు ముఖ్యమైన నదులందు మునుగగవచ్చు ముక్కుబట్టుక సంధ్యమొనసి వార్వగవచ్చు తిన్నగా జపమాల ద్రిప్పవచ్చు వేదాదిశాస్త్రంబు లిరిది చెప్పగవచ్చు శ్రోత్రియాచారముల నెల్లజేయవచ్చు ధనముంతుల కోట దానమివ్వగవచ్చు నైష్ఠికాచారముల్ నడపవచ్చు చిత్తమన్యస్థలములందు జేరకుండ నీపదాంభోజములయందు నిలుపరాదు భూ ౨౯ కర్ణయుగ్మమున నీకథలు సోకితె చాలు పెద్దపోగుల జోళ్లు పెట్టినట్లు చేతులెత్తుచు పూజ సేయగల్గిన చాలు తోరయగు కడియాలు దొడిగినట్లు మొగిశిరస్త్రముతో మ్రొక్క గల్గితె చాలు జెలువమైన తురాయి జెక్కినట్లు గళము పొవ్వాగభటాంగంబు గల్గితె చాలు వింతగా కంఠీలు వేసినట్లు పూని నిను గొల్చుటే సర్వభూషణంబు లితరభూషణముల కిచ్చ యెంచనేల భూ||౨౯|| భువనరక్షక నిన్ను పొగడనేరని నోరు ప్రజకరోచకమైన బాడుబొంద సురవరారాధితు నిన్నుజూపి గోరని కంటి జలములోపలి నెల్లనరువుగుంట శ్రీరమాధిప నీకు సేవజేయని మేను పాలికిష్ముడు బోయిన గొలిమితిత్తి వేడ్కతో నీకథల్ వినని కర్ణములైతె కిరిన శిలాముల గలుగు తొలలు పద్మలోచన నీమీద భక్తిలేని మానవుడు రెండు పాదాల పశువు ఉమ్యా ||౩౦|| అరివిద్య నేర్చుట అన్నవస్త్రమున కెపకొంనార్జించుట పాలకొరకె సతిని పెండ్లాడుట సంసారసుఖముకే సుతుల పోషించుట గతులకొరకె సైన్యముల్ గూర్చుట సతులభయముకే సొమ్ము నేర్చుట చెల్లచావుకొరకె దానమిచ్చుట యుముందటి సంచితమును ఘనము గాచమువుటకె పుకొరకె యితర కామంబుగోరక సతతముగను భక్తినీయందు దుసి ఎపుట ముక్తికొరకె ||౩౧|| ధరణిలో వెయ్యేండ్లు తనువు నిలువగబోదు ధన మెప్పటికి శాశ్వతంబుగాదు దారసుతాదులు తనవెంట రాలేరు భృత్యులు మృత్యువు దప్పింపలేరు బంధుజాలము తన్ను బ్రతికించుకోలేదు బలపరాక్రమము మిపనికి రాదు ఘనమైన సకలభాగ్యంబెంతగలిగియున్న గోచిమాత్రంబైన గొంచబోడు వెట్టిపెట్టకాలభ్రమలన్ని విడిచి నిన్ను భజనజేసెటి వారికి పరమసుఖ

ముగలుగ జేయుము॥౪౫॥ కమలలోచన నన్నుఁ గన్నతండ్రి పిలిచినన్న పలుకవయుం
టివి నేరు విడక నా దరపోషణములైనోక్కి నే నాసి పసర నాకన్నంబు నీవు సడుపు-
పెట్టలేనంటివా పెన్నపిన్నలలోకి దక్కువ కీప్పుడు డీయుడలచినాను- ధనము భాగ్యం
బైన కలకిరీటము సమ్ము కుండలంబులు పైడిగోలుసులమ్ము - కోసకు నీ శంఖచక్ర
ముల్ గుమువజెట్టి- గ్రాసమీవిచ్చి బోషించుకేవటుమడిగి -భూష- ౪౬॥ కవల
యశ్యామ నీకొలువుజేసిన మెచ్చి జీత మెంతమటుమట్ట జెప్పవయ్యా- మంచిమాట
లచేతగొంచమిచ్చ్యగ నేవుకలహమానికి సమ్మీఖండితముగ - నీవు సాధువు కా
నింతపర్యంతంబు భయము చేరిస్తురపహాడవలసె - నీకు నేసహింపనీవిపుడు ద స
న్నేమైనసిత్తు జేసిన సేయుసిద్ధమైన- నేను కర్ణుకోంచకుంటివానిశ్చయముగ- దె
గబడితిజూ మునీతోటి జగడమునకు ॥౪౭॥ హరినీకు పర్యంకమైన శేషుడు చాల
పవనము భక్షించి బ్రతుకుచుంటు - ననువుగా నీకు వాహనమైన ఖగరాజుగొప్ప
పాములనోటగోరుచుండు - పదిగా నీకు భార్యలైన లక్ష్మీదేవి దినము పేరంటా
లకు దిరుగుచుండు- నిన్ను భక్తులు బిల్చి నిత్యపూజలు సేసి శ్రేష్ఠపక్వాన్నములు బె
ట్టుచుండు- స్వస్థముగ నీకు గ్రాసముల్ జరుగుచుండు - గాన నీచేతదొకటైన
దానమ్రయము ॥౪౮॥ పుండరీకాక్ష నారెండు కన్నుల నిండ నిన్ను జూచెడి భా
గ్యమెన్నడయ్యా- వాసిగా నా మనోవాంఛదీరెట్టు సొగసుగా నీరూపు జూపవే
ల- బాపకర్మానికిండ్లబడకపోదాముంచుకరిసమైన ప్రతిజ్ఞ గట్టినావ- వసుధలో
పతితపావనుడవేలవచుబున్యావతులనోట బొగడబడితి- నేనింటికి విస్తరించె
నీకింతకీర్తి - ద్రోహినైన నాకిదు దొరకరాద ॥౪౯॥ పచ్చిచర్మపు తిత్తిపస
లేమదేహంబులోపలనంతటరోతఘనము-నరములు శల్యముల్ నవరంధ్రము
లుగ క్రొవ్వు మాంసంబు కండలు మైలతిత్తి బలువైనయొండవానల కోర్వదంతైన దా
శ లేదాకలిగాహమునకు- సకలరోగములవస్థలు ప్రాప్తమైయుండు నిలువదస్థి
రమైననీ బుగ్గ- బొందిలోనుండి ప్రాణముల్బోయిన వెనుక- గాటికే గాని కో
రగా పనికిరాదైన ॥౫౦॥ బలురోగములకు నీపాదతీర్థమే కానివలపు మంద
లు నేను వల్లనయ్యా- చెలిదపోకిననీకు సేవజేసెదె గాని పంచనాథశాస్త్రి మెం
చనయ్యా- గ్రహభయంబునకు జక్రము దలంచుట గాని ఘోరరక్షలు గట్టగోరన
య్యా- పాముకాటుకు నేను భజన జేసెదగాని దానిమంత్రము నేను దలపలయ్యా-
దోసితిమి నాకు గండిస్తై ద్యుడవు నీవు వెయ్యికష్టాలు వచ్చిన వెరవనయ్యా॥౫౧॥
తాటిరాల కేగదాకోగగాసిజనుల చేబలుగ్గరింపులుబలుకవలసె - దారసుత
భ్రాంతిగిలియుండగగదా జేరి నీచుల సేవజేయవలసె - నభిమానములు మరిసం
టియుండగగదా పరులజూచి నభీతిపడగవలసె- నిటుల సంసారవారధినీదలేక

రయ్యావిధములనిన్ను నేవేడుకొంటి ॥ ౫౨ ॥ సాధుసజ్జనులతో జగడమాడినగీ
పగవులతో వైరంబుగనినగీడు। పరమదీనులజిక్కి పట్టిగొట్టినగీడు భిక్షగాండ్ర
నదుఃఖపెడితె కీడు। నీతిపెద్దల నెల్లనిందజేసినగీడు పుణ్యవంతులదిట్టబోయినగీ
డు। సద్భక్తులనుతిరస్కరమాడినగీడు। గురునిద్రవ్యముదోచుకొనినగీడు। దు
ష్కార్యములొనరించు దుర్జనులకు ఘనతరంబైన నరకంబుగట్టియుల్లె ॥ ౫౩ ॥
పరులద్రవ్యముమీద భ్రాంతినొందెడువాడు పరకాంతలనపేక్ష పడెడువాడు।
నర్థులవిత్తంబు లపహరించెడువాడు పక్ష్యపుసాక్షుంబు బలుకువాడు। విష్ణు
దాసులజూచి వెక్కిరించెడువాడు ధర్మసాధులదిట్టునట్టివాడు। ప్రజలజంతుల
హింసించుపాతకుండు। కాలకింకరగదలచే కష్టమొందు - భూ ॥ ౫౪ ॥ నరసిం
హనాతండ్రిన న్నేలు నన్నేలు కామితార్థములిచ్చి కావుకావు - దైత్యసంహ
రజాలదయయుంచు దయయుంచు దీనపోషణనీవె దిక్కుదిక్కు - రత్నభూషణ
వక్షరక్షించు రక్షించు భువనరక్షక నన్ను బ్రోవుబ్రోవు। మారకోటిస్వరూపమ
న్నించుమన్నించు పద్మలోచన జేయుబట్టుపట్టు। సుగుణసుత నేను నీచాటుజొచ్చి
నాను। నామొరాలించు కడతేర్చు నాగశయన - భూ ॥ ౫౫ ॥ నీభక్తులనుగండ్ల
నిండజూచియు రెండుచేతులదండంబు సేయువాడు - నేర్పుతో నెవరైన నీకథ
చెప్పంగవినయమంముచుజాలవినెడువాడు। తనగృహంబునకు నీదాసులొచ్చి
ననంతపీటపైగూర్చుండబెట్టువాడు - నీసేవకులజాలనీతు లెన్నకబోక దాసో
హమనినిన్ను దలచువాడు। పరమభక్తుడు ధన్యుండు భానుతేజ। వానిగనుగొ
న్నపుణ్యంబు వసుధలోన ॥ ౫౬ ॥ పంజరంబునగాకపక్షినుంచిన లెస్సబలుకునే
వింతైనచిలుకవలెను। గార్దభంబునుదెచ్చి కల్లెమింపుగవేయ దిరుగునే గుఱ్ఱం
బుతీరుగాను। మొనపోతునలమావిటీడు శిక్షించిన నడుచునే మదనారణంబువలె
ను - పెద్దపిట్టకుమేతబెట్టిపెంచినగొప్పదిగునే వేటాడు డేగవలెను। కుజనులమ
దెచ్చినీసేవకొరకుబెట్టి - వాంఛతోజేతురే భక్తవరులవలెను ॥ ౫౭ ॥ నిగమా
దిశాస్త్రములన్నియు చదివినద్విజుడైనయగ్నికర్తగు సోమయాజియైన - ధరణిలో
నప్రభాతస్నానపరుడైననిత్యసత్కర్మాదిరతుడైన। నుపవాసనియమంబు
లొందు సజ్జనుడైన గావివస్త్రముగట్టుస్వాములైన - దండిషోడశమహాదానప
రుండైనసకలయాత్రలుదిరుగుచతురుడైన। గర్వమునకష్టపడనిన్నుగానకు
న్న - మోక్షసాంబ్రాజ్యమొందదు మోహనాంగ - భూ ॥ ౫౮ ॥ పక్షివాహన
నేనుబ్రతికినన్నిదినాలుగొంచెగాండ్లమమంచలించుకొంటి। నన్నవస్త్రములి
చ్చియొండరించుమనుననుగన్నతండ్రివినీవెకమలనాభ - మరణమెయ్యెడినాడు

ముమటత్తాశీవస్త్రిబంటనోలునుముందుబ్రహ్మజవకీయినజభటావళినీదృకళ
కుండకరుణతోనావద్దగావలుంచు- కొనకునీసన్నిధికిబిల్చుకొనియునన్ను-
వకుని జేసుకొనవయ్యశేషశయన ॥౪౯॥ నీకుదాసుడనంటినిన్నునమ్మికను
టి గాననాపై నేర్వకరుణజూడు - దోసిలొగ్గితినాకుద్రోహ మెన్నికబోకుప
ఱొచన నేనుపరుడగాను । భక్తినీపైయుంచిభజన జేసెదగానివరుల వేడను
క్ష్మివరములిమ్ము । దండిదాతవుగానదపుడసేయకగావు ఘోరపాతకరా
గొట్టివేసి- శీఘ్రముగకోరికలీడేర్చి-చింతదీర్చు । నిరతముగనన్నుబోషి
చు నెవరునుండు ॥౫౦॥ విద్యనేర్చితినంచువిఱ్ఱవీగగ లేమ భాగ్యవంతుడన
చుబలుక లేదు । ద్రవ్యవంతుడనంచుదరుచునిక్కఁగ లేదునితరదానములైననివ
లేదు- పుత్రవంతుడనంచుబొగడుచుండగలేమ భృత్యవంతుడనంచుబొగడ
దు । శౌర్యవంతుడనంచుసంతసించగ లేమ కార్యవంతుడనంచుగడచు లేదు । శ
లుగిరికిగాననైననునడుపలేదు । నలినదళనేత్రనిన్నునేనమ్మినాను ॥౫౧॥ అ
ఱొభులనుభిక్షమడుగబోవుటరోత తనద్రవ్య మొకరింటదాచరోత - గుణహీ
నుడగువానికొలువుకొల్చుటరోత యాలులవంచలకిందనుంటరోత । భాగ్యవం
తులతోడబంతమాడుటరోత గురిలేనిబంధులగూడరోత- యాదాయమును లేక
నప్పుసేయుటరోత జారచోరులగూడి జెడుటరోత - యాదలక్ష్మిశనిబంటనైతిన
య్యొ । యింక నెడబాయజన్మంబుసర్వరోత ॥౫౨॥ వెఱ్ఱివానికి నేల వేదాతు
రంబులు మోటువానికిమంచిపాటలేల- పసలగాపరికేలసరతత్త్వబోధలు వేట
గానికి నేలవిష్ణుకథలు । వర్ణశంకరులకేల వ్రాతపుస్తకములు తిరుగుదిమ్మరికేల
దేవపూజ- ద్రవ్యలోభునికేలధాతృత్వగుణములు దొంగబంటుకుమంచిసంగ
తేల- కౄరజనులకునీమీదకోరికేల । సర్వపాపాత్మునకుదయాసత్యమేల॥
౫౩॥ నాతండ్రినాదాతనాయిష్టదైవమానన్నుమన్నన పేయనారసింహ-దయ
యుంచునామీదతప్పులన్నిక్షమించునిగనుగోచరనాకునీవెదిక్కు - నేనురా
త్మ్మడనంచునీమనంబునకోపగించబోకుముస్వామికించనైన । ముక్తిసేయ
కనేదుమొక్కఁనందుకునన్నుకరుణించిరక్షించుకమలనాభ । దండిదొరవంచు
నీ వెంటబడితినాడు । నేడుప్రత్యక్షమైనన్నునిర్వహింపు-౫౪- వేమరునీకథల్వి
నుచునుండెటివాడుపాడుముచ్చటమీదభ్రాంతిపడడు । యగణితంబుగనిన్ను
బొగడనేర్చినవాడుచెడ్డమాటలునోటచెప్పబోడు- ఆసక్తిచేతనిన్నను సరిం
చెటివాడుధనమదాంధుల వెంటదగలబోడు । సంతతంబుసనీదస్మరణ జేసెటి
వాడు వేలగినీచులపేరుదలచబోడు । నిన్నునమ్మినభక్తుండు నిశ్చయముగ- కో
రిదిల దేవాలకో [illegible]

ప్రబలి బిలువ బలుక వేమి | పలికితే నీకున్న పదవేమి బోవునే మోనమైన బూనవే | శరణుజొచ్చినవాని సవరించవలెగాక పరిహరించుట నీకు బిరుదుగాదు | నీదాసులను నీవు నిర్వహించక పోతె వెతలెవ్వరయ్యేరు వారిజాక్ష | దాత దైవంబు తల్లియు తండ్రి నీవె | నమ్మియున్నాను నీ పాదనళినములను ॥ ౭౬ ॥ వేదముల్ చదివేటి విప్రవర్యుండైన రమణ సాధించేటి రాజు అయిన | వర్తకంబాడెడు వైశ్యశ్రేష్ఠుండైన వసుధ దున్నేటి శూద్రవర్యుడైన | మెరుగుఖడ్గము బట్టి మెప్పు మానవుడైన ప్రజలకక్కఱబడ్డ రజకుడైన | చమఱామ మ్మేడిసాఁ ఛండాలు నడైన నీమహీతలమందు నెవ్వడైన | నిన్ను గొనియాడుచుండెనా నిశ్చయముగ- వాడు మోక్షాధికారి నీవసుధలోన ॥ ౭౭ ॥ సకలవిద్యలు నేర్చి సభజయింపగ వచ్చు శూరుడై రణమందు జొరగవచ్చు | రాజరాజై పుట్టి రాజ్యమేలగవచ్చు హేమగోదానంబు లియ్యవచ్చు | గగనమందున్న చుక్కల నెంచుకోవచ్చు జీవరాసుల పేళ్లు జెప్పవచ్చు | నష్టాంగయోగముల్ అభ్యసింపగవచ్చు యేకరీతిగ రాయిమ్రింగవచ్చు - తామరసగర్భ హరపురందరులకైన | నిన్ను వర్ణింపదరమా నీరజాక్ష ॥ ౭౮ ॥ నరసింహ నీవంటి దొరను సంపాదించి కటమాదిసి కొల్వగొల్వజాల - నెక్కువైశ్వర్యంబు లియ్య లేనన్నను బొట్టమాత్రంబైన బోయ్యరాద | ఘనముగాదిది నీకు కరుణ బోషింప కష్టమెంతటి స్వల్పకార్యమయ్యె- పెట్టజాలక నేలబిత్తు మెత్తించేవు నన్ను బేదన జేసినావ దేమి | యమల కమలాక్ష నేనిటు శ్రమపడంగ- గన్నులకు బండువై నీకు గానబడెనొ ॥ ౭౯ ॥ వనజాతనాభ నీవద్ద జేరితి నేను గట్టిగా నను గావు గావుమనుచు | వచ్చినందుకు వేగ వరములిచ్చెను గాని లేకబోయిన నిన్ను లేవనియ్య | గూర్చుండబెట్టి నీ కొంగు గట్టిగ బట్టి పుచ్చుకొందును జూడు భోగిశయన | యీ వేళ నీవద్ద యెవరు వచ్చిన గాని వారికైనా లొంగి పణకబోను | కోపగాడను నీవు నాగుణము దెలిసి | యిపుడె నన్ను రక్షించితే మేలుకొమ్ము ॥ ౮౦ ॥ ప్రహ్లాదుడేపాటి పయిడి కానుకలిచ్చె మును గజంబున్నిచ్చె మౌక్తికములు | నారదుండేపాటి నగలు రత్నములిచ్చె గోపసతియేమి గా ప్రేమనిచ్చె | వుడత నీకేపాటి ప్రాడిగంబులు చేసె ఘనవిభీషణుడేమి కట్నమిచ్చె | బంచపాండవులేమి లంచమిచ్చిరి నీకు ద్రౌపది సౌకరిగ ద్రవ్యమిచ్చె | నీకు వీరందరైనట్లు నేను గాన- యెందుకని నన్ను రక్షించ విందువదన ॥ ౮౧ ॥ వాంఛతో బలిచక్రవర్తి దగ్గర జేరి బిత్తిమెత్తితి వేళ విడియపడక | సదర్థిలో శబరి ధీయని ఫలాలందియ్య జేతులొగ్గితి వేల సిగ్గుపడక | నటుకు సల్లప్పు మాను జేలుడు చేచ్చి యిచ్చినవి ఒక్కసారి గతి వేల లెక్కగొనక | భక్తులకు నీవు పెట్టుట భాగ్యమవు [illegible] ॥ ౮౨ ॥ సంపదమందు దయింవిరాగి నీ

దుష్టదైత్యుని ద్రుంచి కరుణతో ప్రహ్లాదుఁ గాచినావు। మకరిచేఁ జిక్కి సామజము దుఃఖించుచోఁ గృపదలఁచి వేగ రక్షించినావు। శరణుఁ జొచ్చినా విభీషణుఁడు నీచాటునకు వచ్చినప్పుడే లంక నిచ్చినావు। వారివలెనె నన్ను బోషింపవశము గాదా। యింతవలపక్ష మేల శ్రీరమానాథ నీకు ॥ ౨౩ ॥ వ్యాసుఁ డేకులమందు వాసిగఁ జన్మించె విదురుఁ డేకులమందు వృద్ధిఁ బొందె। కర్ణుఁ డేకులమందు ఘనముగ వర్ధిల్లె నా వసిష్ఠుం డెక్కడ వెలిగించె। నింపుగా వాల్మీకి యేకులంబున మించె గుహుఁడను పుణ్యుఁ డేకులమువాఁడు। శ్రీశుకుం డెచ్చట జెలఁగి జన్మించెను శబరి యేకులమందు జాతిఁ బొందె। నేకులంబున నీకిందరెచ్చి చెలఁగి కృపాపాత్రులకు జాతినీతు లేల ॥ ౨౪ ॥ వసుధాస్థలంబున వర్ణహీనుఁడు గాని బహుళదురాచారపరుఁడు గాని। తడసి కాసియ్యని ధనలోభుఁడు గాని చదువ నేరని శుంఠ జడుఁడు గాని। సకలమానవులు మెచ్చని కష్టుఁడు గాని చూడ సొంపు లేని వాఁడు గాని। యప్రతిష్ఠకులలో నైన నధముఁడు గాని మొనటికే మెఱుఁగని మోటు గాని। ప్రతిదినము నీదు భజనచే బరగినట్టి వానికే వంక లేదయ్య వాని ముక్తి। భూ॥ ౨౫॥ ఇహసంబంధములమీఁద కేగ రేఁడు సింహంబు ముట్టునే మురుచైన మాంసకమును। వసమయూరపత్రమున నములుచున్న పికంబు కొరకునే జల్లెడు కొనలు నోట। నగవిందమకరందము ననుభవించెడు తేఁటి బోవునే పల్లేరుపూలకడకు। లలితమైన సాలఫలము గోరెడు చిల్క మేసునే భ్రమత యుమ్మెత్తకాయ। నిజము నీకీర్తనల్ పాడ నేర్చిన తడు। పరులకీర్తనల్ పాడునే యొరసి చూడ ॥ ౨౬॥ సర్వేశ నీపాదసరసిజద్వయము నందు చిత్తము నుంచఁగలేను చెదరకుండ। నీవైన దయయుంచి నిలిచి యుండెటట్టు జేసి నన్నిపు డేలు సేవకుఁడను। వనజలోచన నేను వట్టిమూర్ఖుండను సుమ్మి నీ స్వరూపము జూడ నేర్పు వేగ। దనువు నారునకుగ్గు దగిలి బోసినయట్లు భక్తిమార్గంబు నా పాలఁ బోసి। పేర్మితో నన్ను బోషించి పెంచుకొనియు। ఘనత కెక్కించు నీదాసగణములోన। భూ॥ ౨౭॥ జీమూతవర్ణ నీ మోముతో సరిరాక గగనచారియై యతికళంకమున బడియె। సొగసైన నీ నేత్రయుగముతో సరిరాక నలినబృందము నీళ్ల నణఁగె। కరిరాజవరద నీగళముతో సరిరాక పెద్దశంఖము బొబ్బపెట్టఁ బోఁడగె। శ్రీపతి నీ దివ్యరూపుతో సరిరాక పుష్పబాణుఁడు నీకు పుత్రుఁ డయ్యె। కంది రాజీవ నిన్ను మోహించి విడక। నీకు బట్టంపు రాణి యయ్యె నిందిరామణి। భూ॥ ౨౮॥ హరిదాసులను నిందలాడకుండినఁ జాలు సకలగ్రంథము లెల్లఁ జదివినట్లు। భిక్ష మియ్యంగ దప్పించకుండినఁ జాలు జేముట్టి దానంబు జేసినట్లు। మించిన సజ్జనుల వంచకుండినఁ జాలు నింపుగా బహుమాన మిచ్చినట్లు। దేవబ్రాహ్మణుల మాన్యము గొనకుండినఁ జాలు గనకకంఠ

ఖల్ గట్టినట్లు ॥ ౭౯॥ ఇహలోకసౌఖ్యములిచ్ఛగించెదమన్న దేహ మెప్పటి దాస్థిరత్వ నొంద। దాయుష్యమున్నపర్యంతంబు సుపటుత్వ మొక్కతీరుననుండదుర్వి లోన। బాల్యయౌవనముదుష్ఫలపువృద్ధత్వంబుమాటిలోనుండెడిమురికిచెత్త। భ్రాంతితోదనికాపాడుదామనుకొంటె గాల మృత్యువు చేతగోలుగూడు। నమ్మరావయ్యయిదిమాయనాటకంబు। జన్మమిఖనేలనన్నేలు జలజనాభ। భూ॥౮౦॥ భావలబునీనామభజనగోరుచునుండుజిహ్వనీకీర్తనల్ జేయుగోరు। హస్తయుగ్మంబునిన్నర్చింపగోరునుగర్ణములీన్నమీదకథలుగోరు। ధనువునీసేవనుఘనముగాగోరునునయనములీన్నదర్శనంబుగోరు। మూర్ధనీపాదముల్ ముక్కగాగోరుసుదనువునీదై యుండుధరణిలోన। స్వప్నముననైన నే వేళ సలతముగను। బుద్ధినీపాదములయందుబూనియుండు ॥౮౧॥ పర్యాప్తమగుకళేబరములందనుటంచువిజ్ఞవీగెదనయ్య వెట్టిబట్టి। మాస్వతంత్రంబైనమదిముగంధ్యకరంగప్పిసుగముపట్టుసుకాను మోహమునకు। బ్రహ్మదేవుండైనబైడిదేహముగల్గజేసి వేయకమమ్ము జేరిచినతడు। తుచ్ఛమైనటియట్టితోలుదోముకలతోటిమురికిచెత్తుజేసి ఇప్పటెట్టి। నీశరీరాలుబడిపోవు బెరిగివేసము। కాముకులమైతిమికమిమ్మగానలేము। భూ ॥౮౨॥ గరుడవాహన దివ్యకౌస్తుభాలంకారరవికోటితేజసారంగవరద। మణిగణాన్విత హేమమకుటాభరణచారుమకరకుండలసుమందహాస। కాంచనాంబరరత్నకాంచివిభూషితసురవరార్చితచంద్రసూర్యనయన। కమలనాభముకుందగంగాధరస్తుతరాక్షసాంతకనాథరాజశయన। పతితపావనలక్ష్మీశబ్రహ్మజనక। భక్తవత్సలసర్వేశపరమపురుష ॥౮౩॥ పలుమారుదశరూపములుధరించితి నేలనేకరూపమునొందనేలనీవు। నయమునక్షీరాబ్ధిదరినుజేరితి వేలరత్నకాంచనమందిరములులేవ। పన్నగేంద్రునిమీదబవ్వళించితివేలజలతారుపట్టెమంచములులేక। రెక్కలుగలపక్షి నెక్కసాగితివేలగజతురంగాందోళికములులేవ। వనజలోచనయిటువంటివైభవములు। సొగసుగానీకుదోచెనోసుందరాంగ। భూ॥౮౩॥ తిరుపతిస్థలమందుదిన్నగా నేనున్న వెంకటేశుడు మేతబెట్టలేడ। పురుషోత్తమునకు నేనెప్పుడుబోయిన జాలుజగన్నాథుడన్నంబుగడపలేడ। శ్రీరంగమునకు నేచేరబోయిన జాలుస్వామిగ్రాసముబెట్టిసాకలేడ। కాంచీపురములోనగడసి నేకొలువున్న వరదుడుపొట్టగడపలేడ। యెందుబోయిను నేను నీమందిరమున। నిల్చిచితినినీవు నామీదనేరములేవ ॥౮౫॥ తార్క్ష్యవాహననీవుకుండిదాగవటంబుగోరవేడుకనిమ్ము గొల్లవచ్చి। యోగిమార్గమున నేనను

[illegible]

బుభూవసాగీతినాకుసుందరాంగ । యానందమైననేడుగవచ్చినందిచ్చివాంఛ
దీర్పఁగామునిలవర్ణవేగ। నీకునావిద్యహాస్యంబుకాకపోతె । దేవ తేపకు వేష
ముల్దేనుసుమ్మి। భూ॥౮౬॥ అమరేంద్రవినుత నేనతిదురాత్ముఁడనంచుగల్లలో
నైననుగడ్డఁబడవు। నాకుప్రత్యక్షమైనిలువకుండినమానె ధ్రోడ్డుగా నెకయు
క్తిచూరికెనయ్యఘట్టికొయ్యనుదెబ్బఘనముగాఖండించినీశ్వరూపముఁ జేసని
లుపుకొందు । ధూపదీపములిచ్చితులసితోఁబూజించినిత్యనైవేద్యమ్ములిడ
ను। నడుపుచునునిన్నుగొల్చెదనమ్మిబుద్ధి । నీప్రపంచంబుగలిగినం కింతె చా
లు ॥౮౭॥ లక్ష్మీశగోవిందరవికోటిసంకాశపక్షివాహనభక్తపారిజాత।
యంభోజభవరుద్రజంభారిసన్నుతసామగానవిలోలసారసాక్ష । వనధిగంభీర
శ్రీవత్సకౌస్తుభవక్షశంఖచక్రగదాసిశార్ఙ్గహస్త । దీనరక్షకవాసుదేవదై
త్యవినాశనారదార్చితదివ్యనాగశయన। చారునవరత్నకుండలశ్రవణయుగళ।
విబుధవందితపాదాబ్జవిశ్వరూప । భూ ॥౮౮॥ నాగేంద్రశయననీనామమా
హాత్మ్యంబుమూఢుకన్నులసాంబమూర్తికెరుక । పంకజాతాక్షనీబలపరాక్ర
మమెల్లభారతీపతియైనబ్రహ్మకెరుక। మధుకైటభారినీమాయసామర్థ్యం
బువసుధలోబలిచక్రవర్తికెరుక । పరమాత్మనీదగుపక్షిశౌర్యత్వంబుదశశ
తాక్షులపురందరునికెరుక। వీరికెరుకగునీకథలింతెల్ల । నరులకెరుకన్న నె
వ్వరైననవ్విపోర ॥౮౯॥ అందరేమైననిన్నడుగవచ్చెదరంచు క్షీరసాగరమందు
చేరినావు । నీచుట్టుసేవకుల్నిలువకుండుటకునై భయదసర్పమ్ముమీఁదబండినా
వు। భక్తబృందమువెంటబడిచేరిందెవరందు నెగసిపోవ్యోమపక్షినెక్కినావు।
దాసులునీద్వారమాశించకుండుటకుమంచియోధులకావలుంచినావు । లాపుగ
లవాడవైతివేలాగునేను । నిన్నుజూతునునేలాగునీరజాక్ష ॥౯౦॥ నీకథలెవ్వ
రులలోసోకుట మొదలుగాపులకాంకురములుమేనఁబుట్టువాఁడు । నయమైననీది
వ్యనామకీర్తనలోనమగ్నుఁడై దేహంబుమరచువాఁడు । ఫాలంబుననునీదుపా
దయుగ్మములకుప్రేమతోదండముపెట్టుచువాఁడు । హాపుండరీకాక్షహారామ
హరియంచువేడ్కతోఁగేకలువేయువాఁడు। చిత్తకమలంబులనునిన్నుజేర్చువా
ఁడు నీదులోకంబునందుండునీరజాక్ష।భూ ॥౯౧॥ నిగమగోచర నేనీకు మెప్ప
గునట్లులెస్సగాబూజింపలేనుసుమ్మి। నాకుదోచినభూషణమునీకుపెట్టెదమన్న
కౌస్తుభమణినీకుగలదు । భక్ష్యభోజ్యములనర్పణముసేయుదమన్ననీవుబెట్టి
తిసుధ్ధనిర్జరులకు। గలిమికొలదిగానుకలదొసంగదమన్నభార్గవీదేవినీభా
[illegible] నెంత

నామనంబున నిన్ను నమ్మి సంతుష్టుఁడండి మేలు నాకొనరించు నీలదేహ! భళిభళీ
నీయంత ప్రభువు నెక్కడఁ జూడఁ బుడమిలో నీ పేరు బొగడనయ్య | ముందు జేసిన
పాపములు నశింపఁగ జేసి నిర్వహించితి నయ్య నేర్పుతోడ | పరమసంతోషమా
య నాప్రాణమునకు| నీ దురుణము నదిదీర్చఁగో నీరజాక్ష ||౯౩|| ఫణుల పుట్టల
మీద పవ్వళించియున్నట్లు పులుల చోటుట జేరబోయినట్లు| మకరవగణంబున్నను
దుగుజొచ్చినోయట్లు గంగ దాపున యిండ్లు గట్టినట్లు | చెదలు భూమిని యుంచి చా
పబరచినయట్లు వోటిబిందెలో పాలు బోసినట్లు | వెఱ్ఱివానికి హానవిత్తమిచ్చిన
యట్లు కమ్మగు జీశెలముందు గాల్చినట్లు | స్వామి నీ భక్తవరులు దుర్జనులతో
టి| చెలిమి జేసినయట్టుల చేటువచ్చు| భూ ||౯౪|| దనుజసంహారచక్రధర నీకు
దండంబు యిందిరాధిప నీకు వందనంబు| పతితపావన నీకు బహునమస్కారము
లీ నీరజాతదళాక్ష నీకు శరణు| వాసవార్చిత మేఘవర్ణ నీకు శుభంబు మండ
రధర నీకు మంగళంబు| కంబుకంధర శార్ఙ్గకర నీకు భద్రంబు దీనరక్షక నీకు దిగ్వి
జయము| సకల వైభవములు నీకు సార్వభౌమ | నిత్యకల్యాణములు నగు నీకు నె
పుడు ||౯౫|| మత్స్యావతారమై మడుగులో పలజొచ్చి సోమకాసురు ద్రుంచి
చోద్యముగను | తెచ్చి వేదములెల్ల దేవ బ్రాహ్మణులకు మెచ్చి యిచ్చితి నీవు మే
లుగాను| యా దేవముల నియ్యనాచారనిష్ఠల ననుభవించుచునుందురవనిసురలు|
సకలపాపంబులు సమసిపోవునటంచు మనుజులందరు నీ మహిమ దెలిసి| యుం
దురిట్టివంటివారమీయురికి దెలసి| వాదికిని వేగ మోక్షంబు వచ్చు నెపుడు| భూ
||౯౬|| కూర్మావతారమై కుధరంబు క్రిందను కోర్కెతో నుండవా కోమరుమిగు
ల| వరహావతారమై వనభూములను జొచ్చి శిక్షించవా హిరణ్యాక్షునపుడు| న
రసింహమూర్తివై గురుతుగా హిరణ్యకశిపుని ద్రుంచవా కాంతిమీర | వా
మనరూపమైవ సుఖలో బలిచక్రవర్తిని నణపవా వైరమునధు | యిట్టిపను లెల్ల
సేయును యెవ్వరికిని | తగును నరసింహ మీకె తెతగును గాక ||౯౭|| లక్ష్మీశ నీ
దివ్యనామకీర్తనలన్ని వినజాలకిప్పుడు వెఱ్ఱినైతి| నా వెఱ్ఱిగుణములు నయముగా
ఖండించి నన్ను రక్షించుమో నళినేత్ర | నిన్ను నమ్మితిగాని యితర దైవముల నేన
మ్మ లేదిప్పుడే నాగశయన| కాపాడి నను నీ వెకష్టబెట్టిన నీ వెనీ పాదకమలముల్ని
రతముగను| నమ్మియున్నాను నీకటాక్షమ్ము నాకు | వేగ దయ జేసి రక్షించు వేద
వేద్య| భూ ||౯౮|| అమరేంద్రవినుత నిన్ను నుసరించినవారు ముక్తిఁ బొందిరి నేక
ముదముతోడ| నీ పాదపద్మములెన్నిక నమ్మియున్నాను నాకు మోక్షంబిమ్ము నళిన
[illegible]

రు వేడెదనబ్జనాభ! నాకుప్రత్యక్షమునగునినమ్మినాను|భూ ||౯౯|| శేషప్పయను
కవిచెప్పినపద్యములు చెవులకానందమై చెలగుచుండు| నేనరుడైనను నెలమినీ
శతకంబుభక్తితోవిన్నను ఫలముగల్గు| చెలగియీపద్యముల్ వ్రాసినవారుక
మలాక్షుకరుణను గాంతురెపుడు| నింపుగానీపుస్తకంబెపుడుపూజించినదు
రితజాలంబులుదొలగిపోవు| నిట్టిపుణ్యంబుదెలిసియు నెపుడుజనులు| కష్టమన
కనుపఠియించగల్గుఫలము| భూషణవికాసశ్రీధర్మపురనివాస| దుష్టసంహారన
రసింహదురితదూర|| ||౧౦౦||

నృసింహశతకము.

సంపూర్ణము.

పురసపాకమ్, పళమలపిల్లగారి,
వివేకవిరంజనీముద్రాక్షరశాలయందుముద్రించి ప్రచురింపఁబడియె.
[illegible]